# బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు రచించిన శ్రీ హనూమద్దండకం ( ప్రతిపదార్థముతో)

**రచన – ఆచార్య తాడేపల్లి పతంజలి**




**శ్రీరామదూతా! శ్రితార్తిప్రహర్తా! భవిష్యద్విధాతా! పరేశప్రమోదా! సమీరసంభూతా! సమస్తప్రగీతా!**

**పరాస్తాసురప్రేతబేతాళభూతాది ఘాత! సీతామహామాతృకాన్వేషణా**

**భాషణాదిప్రకారప్రశస్తప్రసంగప్రసన్నప్రజానాథధ్రుక్స్వావితా! పావనీ! పావనాత్మీయగామా! హరీ! మర్కటా! మర్కటాయితా!**

**సంచితానేక సత్కార్యసంభార! స్వాహాకృతిప్రాయసంపత్తి**

**బీజప్రశస్తాభిధేయాక్షరీభూతమంత్రాక్షరాతీతసంక్రమణపర్యస్తతంత్ర! స్వతంత్రాత్మభాస్వద్విడౌజా! ప్రవృద్ధాంగా!**

**వీరాహవోపాంతకాంతస్వరూపప్రసారా! మహాప్రాభవప్రాభృత భూతలోకౌఘసద్భక్తి!**

**సూత్రైకప్రోతసూక్తిప్రసూనాచ్ఛగుచ్ఛస్రగాబద్ధసర్వాంతరవ్యాప్తతద్విశ్వరూపాయితస్వీయకీర్తి ప్రియామూర్తిదత్తాదరా!**

**శ్రీప్రపత్తాంజనేయా! ప్రభాదివ్యకాయా! ప్రమాణప్రమేయా! విధూతారిమాయా! విమాయా!**

**స్వవాలాగ్రచాంచల్యసంస్ఫోట్యమానోచ్చలత్కర్పరభాండాండ! బ్రహ్మాండా!**

**గలద్గండభేరుండరుండాంత్రమాలాధరాదిప్రయోగా! నియోగానపేతప్రవేగా!**

**సువేగాపగాజాలసంపూర్యమాణాద్రిసోపద్రవచ్ఛాయికామాయికాంచర్లహగ్రాహసంభార**

**సంభీకరాంభోధినిర్విఘ్నకైకలోద్వేగాలంకృతావేలభూమధ్యగానేకగవ్యూతిదీవ్యత్ప్రదేశా! జయశ్రీప్రదప్రసాదా!**

**సదాస్వసాహాయ్యనాపేక్ష! సాపేక్షదేహిస్పృహాపూరణార్థా! నిరర్థార్థ! విచారాత్తతత్త్వత్యగాత్మప్రయత్తచిత్తా! నతత్తా!**

**నతారకా! రామగాథాసుధా మాధురీలోల! లీలాప్లవంగా! నిస్సంగా! సుసంగా! మహాంగా! త్వదేకార్థినం మామకామర్థినం**

**మామవాశేషదోషాపహారిణం కురు శ్రేయ ఆధత్స్వ మయ్యంజసా! తే నమస్తే నమస్తే నమః.**

**ప్రతిపదార్థం**

**శ్రీమదనుమద్దండకము: శ్రీకారంతో కూడిన, గొప్ప హనుమంతుని స్తుతించే దండకము.**

- **శ్రీరామదూతా! – శ్రీరామునికి దూతవైనవాడా! (శ్రీరాముని తరపున రాయబారిగా వెళ్లినవాడా!)**
- **శ్రితార్తిప్రహర్తా! – శరణు పొందినవారి కష్టాలను తీర్చేవాడా! (శరణాగతుల బాధలను పోగొట్టేవాడా!)**
- **భవిష్యద్విధాతా! – భవిష్యత్తును నిర్ణయించేవాడా! (జరగబోయే దానిని శాసించేవాడా!)**
- **పరేశప్రమోదా! – గొప్ప ఈశ్వరునికి (శివునికి) ఆనందాన్ని కలిగించేవాడా! (శివ స్వరూపుడైనవాడా, శివుడికి ప్రియమైనవాడా!)**
- **సమీరసంభూతా! – వాయుదేవునిచే పుట్టినవాడా! (వాయుపుత్రా!)**
- **సమస్తప్రగీతా! – అందరిచే కీర్తించబడినవాడా! (అందరూ గొప్పగా పాటలు పాడుతూ కొలిచేవాడా!)**
- **పరాస్తాసురప్రేతబేతాళభూతాది ఘాత! – రాక్షసులు, ప్రేతాలు, బేతాళాలు, భూతాలు మొదలైనవాటి సమూహాలను నాశనం చేసినవాడా! (దుష్ట శక్తులను సంహరించినవాడా!)**
- **సీతామహామాతృకాన్వేషణా భాషణాదిప్రకారప్రశస్తప్రసంగప్రసన్నప్రజానాథదృక్పావితా! – సీతాదేవిని వెదకడంలో, ఆమెతో మాట్లాడటంలో (ఆమె గురించి అన్వేషించి, మాట్లాడి), శ్రీరాముని కళ్ళకు ఆనందాన్ని కలిగించి, ఆయన చూపులచే పవిత్రం చేయబడినవాడా! (సీతాన్వేషణ, సంభాషణల ద్వారా రాముని దయకు పాత్రుడై, ఆయన చూపులతో పవిత్రమైనవాడా!)**
- **పావనీ! – పవిత్రమైనవాడా!**
- **పావనాత్మీయగామా! – తన నడవడికచే (పనులచే) పవిత్రమైనవాడా! (పవిత్రమైన కార్యాలను చేసేవాడా!)**
- **హరీ! – హరించేవాడా! (పాపాలను తొలగించేవాడా!)**
- **మర్కటా! – వానర రూపుడా!**
- **మర్కటాయితా! – వానరం వలె నటించేవాడా! (వానర చేష్టలు చేసేవాడా!)**

- సంచితానేక సత్కార్యసంభార! – అనేక మంచి పనుల సమూహాన్ని పోగు చేసుకున్నవాడా! (ఎన్నో పుణ్య కార్యాలు చేసినవాడా!)
- స్వాహాకృతిప్రాయసంపత్తి బీజప్రశస్తాభిధేయాక్షరీభూతమంత్రాక్షరాతీతసంక్రమణపర్యస్తతంత్ర! – స్వాహాకారంతో సమర్పించే యజ్ఞ సంపదకు మూలమైన, గొప్ప అక్షర స్వరూపమైన మంత్రాక్షరాలకు అతీతమైన (అంటే మంత్రాలకు కూడా అందనంత గొప్పదైన), సమస్త కర్మకాండలకు పర్యవసానమైన (ఫలమైన) తంత్ర స్వరూపా! (యజ్ఞాల ఫలంగా లభించేవాడా, మంత్రాలకు అతీతమైన వాడా!)
- స్వతంత్రాత్మభాస్వద్విడౌజా! – స్వతంత్రుడైన ఆత్మ స్వరూపంగా, ఇంద్రుడి వలె ప్రకాశించేవాడా! (తన ఇష్టానుసారం ప్రవర్తించే, ప్రకాశవంతమైన శక్తి స్వరూపుడా!)
- ప్రవృద్ధాంగా! – బాగా పెరిగిన శరీరము కలవాడా! (శరీరాన్ని పెద్దది చేసుకున్నవాడా!)
- వీరాహవోపాంతకాంతస్వరూపప్రసారా! – యుద్ధంలో శత్రువులకు భయంకరమైన, అందమైన రూపాన్ని ప్రదర్శించేవాడా! (యుద్ధరంగంలో తన శౌర్యంతో ప్రకాశించేవాడా!)
- మహాప్రాభవప్రాభృత భూతలోకౌఘసద్భక్తి! – గొప్ప ప్రభావం కలవాడా! లోక సమూహాల యొక్క నిజమైన భక్తికి నిలయమైనవాడా! (లోక ప్రజలు ఎంతో భక్తితో పూజించేవాడా!)
- సూత్రైకప్రోతసూక్తిప్రసూనాచ్ఛగుచ్ఛస్రగాబద్ధసర్వాంతరవ్యాప్తతద్విశ్వరూపాయితస్వీయకీర్తి ప్రియామూర్తిదత్తాదరా! – సూత్రంలో (దారంలో) గుచ్చబడిన పూల గుత్తుల మాలలాగా, సకల ప్రాణుల అంతరంగంలో వ్యాపించిన విశ్వరూపాన్ని తన కీర్తిగా స్వీకరించి, ప్రియమైన రూపంతో ఆదరాన్ని పొందేవాడా! (గొప్ప సూత్రం వలె, అన్ని హృదయాలలో వ్యాపించి, తన కీర్తిని విశ్వరూపంగా చేసుకుని, ప్రియమైన రూపంతో అభిమానాన్ని పొందేవాడా!)
- శ్రీప్రపత్తాంజనేయా! – శ్రీరామునికి శరణాగతుడైన అంజనా పుత్రా! (లక్ష్మీ సమేతుడైన రామునికి శరణు పొందిన అంజనేయా!)
- ప్రభాదివ్యకాయా! – కాంతివంతమైన దివ్య శరీరం కలవాడా!
- ప్రమాణప్రమేయా! – ప్రమాణాలకు (రుజువులకు) నిదర్శనమైనవాడా, ప్రమేయమైనవాడా (తెలుసుకోదగినవాడా)! (నిజమైన జ్ఞానానికి మూలమైనవాడా!)
- విధూతారిమాయా! – శత్రువుల మాయలను పోగొట్టినవాడా! (శత్రువుల కుతంత్రాలను నాశనం చేసినవాడా!)
- విమాయా! – మాయలు లేనివాడా! (నిజమైనవాడా, కల్మషం లేనివాడా!)

- స్వవాలాగ్రచాంచల్యసంస్ఫోట్యమానోచ్చలత్కర్పరభాండాండ! — తన తోక చివరి భాగం యొక్క కదలికలతో బ్రహ్మాండంలోని గట్టిపడిన పైభాగాన్ని (ఆకాశాన్ని) బద్దలు కొట్టినవాడా! (తోకను అటూ ఇటూ కదుపుతూ విశ్వాన్నే కదిలించినవాడా!)

- బ్రహ్మాండా! — బ్రహ్మాండ స్వరూపుడా! (విశ్వమే తన రూపంగా కలవాడా!)

- గలద్గండభేరుండరుండాంత్రమాలాధరాదిప్రయోగా! — తెగిపడిన భేరుండ పక్షుల తలలు, పేగుల దండలను ధరించినవాడా! (భయంకరమైన రూపాలను ధరించి శత్రువులను సంహరించేవాడా!)

- నియోగానపేతప్రవేగా! — ఆజ్ఞను పాటించడంలో ఆగని వేగం కలవాడా! (అత్యంత వేగంగా ఆజ్ఞలను పాటించేవాడా!)

- సువేగాపగాజాలసంపూర్యమాణాద్రిసోపద్రవచ్ఛాయికామాయికాంచర్గ్రహగ్రాహసంభార సంభీకరాంభోధినిర్విఘ్నకైకలోద్వేగాలంకృతావేలభూమధ్యగానేకగవ్యూతిదీవ్యత్ప్రదేశా! — వేగంగా పారే నదుల సమూహంతో నిండిన, పర్వతాలు, ఉపద్రవాలు, నీడలు, మాయలు, లోపల ఉన్న మొసళ్ళతో నిండిన భయంకరమైన సముద్రంలో ఎటువంటి ఆటంకం లేకుండా ఒక్కసారిగా దూకి, అలంకరించబడిన, తీరం లేని, అనేక గవ్యూతి దూరంలో ఉన్న మధ్య ప్రదేశంలో ప్రకాశించేవాడా! (వేగంగా ప్రవహించే నదులతో, కొండలతో, విపత్తులతో, మాయలతో, మొసళ్ళతో నిండిన భయంకరమైన సముద్రాన్ని ఎలాంటి ఆటంకాలు లేకుండా దాటి, మధ్యలో అనేక ఆమడల దూరం ప్రకాశించినవాడా!)

- జయశ్రీప్రదప్రసాదా! — విజయాన్ని, ఐశ్వర్యాన్ని ఇచ్చే అనుగ్రహం కలవాడా! (జయలక్ష్మిని ప్రసాదించేవాడా!)

- సదాస్వసాహాయ్యనాపేక్ష! — ఎల్లప్పుడూ తన సహాయాన్ని ఆశించనివాడా! (ఎవరి సహాయమూ కోరనివాడా!)

- సాపేక్షదేహిస్పృహాపూరణార్థా! — కోరికలు కలిగిన శరీరధారుల ఆశలను తీర్చడం కోసం (సహాయం చేసేవాడా)! (కోరికలున్నవారి కోరికలను తీర్చేవాడా!)

- నిరర్థార్థ! — నిరర్థకం కాని అర్థం కలవాడా! (వ్యర్థం కాని, సార్థకమైన అర్థం కలవాడా!)

- విచారాత్తతత్ప్రత్యగాత్మప్రయత్తచిత్తా! — విచారణచేత ఆ ప్రత్యగాత్మ (అంతరాత్మ) యందు ప్రయత్నించిన మనస్సు కలవాడా! (ఆత్మ విచారణ ద్వారా పరమాత్మను తెలుసుకోవడానికి ప్రయత్నించిన మనస్సు కలవాడా!)

- నతత్తా! — నమస్కరించబడినవాడా! (వందనీయుడా!)

- నతారకా! — తారకులను (జనన మరణ చక్రం) దాటించేవాడా! (మోక్షాన్ని ప్రసాదించేవాడా!)

- **రామగాథాసుధా మాధురీలోల**! **— రామకథ అనే అమృతపు తీయదనానికి ఆసక్తి కలవాడా**! (**రామకథ అనే అమృతాన్ని ఆస్వాదించేవాడా**!)
- **లీలాప్లవంగా**! **— క్రీడించే కోతి రూపుడా**! (**లీలగా తిరిగే వానరుడా**!)
- **నిస్సంగా**! **— సంగమం లేనివాడా**! (**ఆసక్తి, కోరికలు లేనివాడా**!)
- **సుసంగా**! **— మంచి సంగమం కలవాడా**! (**మంచి స్నేహం, సహవాసం కలవాడా**!)
- **మహాంగా**! **— గొప్ప శరీరం కలవాడా**!
- **త్వదేకార్థీనం మామకామర్థినం మామవాశేషదోషాపహారిణం కురు**! **— నీపైనే ఏకైక కోరిక కలవాడైన నన్ను, కోరికలు కల నన్ను, సమస్త దోషాలను పోగొట్టేవాడిగా చెయ్యి**! (**నీపైనే ఆధారపడిన నన్ను, కోరికలున్న నన్ను, నా దోషాలన్నీ పోగొట్టి రక్షించు**!)
- **శ్రేయ ఆధత్స్వ మయ్యంజసా**! **— శుభాన్ని నాకు తక్షణమే కలిగించు**! (**వెంటనే నాకు మేలు కలిగించు**!)
- **తే నమస్తే నమస్తే నమః**! **— నీకు నమస్కారం, నమస్కారం, నమస్కారం**!